# రిజర్వు బ్యాంకు

గ్రంథకర్త:

## కాశీనాధుని పూర్ణమల్లిఖార్జునుడు

మొదటి కూర్పు 500

బందరు మినర్వా ముద్రణాలయమునందు

ముద్రింపబడియె.

**1934.**



    [వెల రు. 0—8—0

# పీఠిక

బ్యాంకింగు విషయములందు పండితుడనను అభిప్రాయముతో నీ చిన్న పొత్తమును వ్రాయలేదు. రిజర్వు బ్యాంకు విషయమై నాకు తెలిసిన కొలదిసంగతులను పాఠకులకు సులభముగా బోధపడగలరీతిని వ్రాయబూని యీ ప్రయత్నమును జేసినాడను. మన దేశమునగల రాజకీయ నాయకులలో ముఖ్యులైన భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు, లోగడ నేను కృష్ణాపత్రికలో నీ విషయమై వ్రాసిన వ్యాసముల తిలకించి, వానిని సంగ్రహముగా మార్చి యొక చిన్నపొత్తముగ క్రోడీకరించిన బాగుండునని చెప్పిన మీదట, వారి సలహాప్రకారము యీ పనికి గడంగితిని. అందుకు చాలనివాడనైనను, పూనిక చేసినందుకు క్షమ్యుడను.

కేవలము బ్యాంకింగు అననెట్టిదో తెలియనివారికి తెలియజేయవలెనను అభిప్రాయముతో, డబ్బు అననెట్టిదో, దానిస్వరూపమేదియో, దానిని తయారుజేయు సంస్థలెట్టివో మొదటి అధ్యాయమున వ్రాసితిని. ఇట్టి సంస్థలలో బ్యాంకు లనునవి ప్రధానములనియు, రిజర్వుబ్యాంకు యొక్క అవసరమును గూర్చియు రెండవ అధ్యాయమున వ్రాసియుంటిని.

రిజర్వుబ్యాంకు చేయు పనులెవ్వియో, దానివలన లాభము లెట్టివో, మూడవ అధ్యాయమున వివరింపబడియెను. రిజర్వుబ్యాంకులు యేతీరుగానున్నవో రిజర్వుబ్యాంకును స్థాపింప వలసినదిగా మన దేశములో జరిగిన ఉద్యమమును గూర్చియు నాల్గవ అధ్యాయమున ముచ్చటించితిని. ఈ పొత్తమును పరిశీలించి యిందలి గుణములను మాత్రమే గ్రహించి దోషములను పాఠకులు క్షమింతురుగాక యని వేడుచున్నాను.

బుట్టయ్యపేట,
బందరు.
2-3-1934

ఇట్లు బుధవిధేయుడు,
కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు.
ఎం. ఏ. బి. యల్.



# రిజర్వు బ్యాంకు



## మొదటి అధ్యాయము

మనుష్యులకు పరస్పరము అనేకవ్యవహారము లుండుట అనుభవవేద్యము. ఆవ్యవహారములు సాగుటకు సాధనములు గలవు. ఆర్థికవ్యవహారములలో గూడ నట్టి సాధనములున్నవని ప్రతివారికిని దెలియును. ఈ సాధనములకే ప్రమాణములనిపేరు. శేరు, కుంచము, మానిక మొదలైనవి వస్తువులను గొలుచుటకు ప్రమాణములు. తులము వీశె మణుగు మొదలైనవి తూచుటకు ప్రమాణములు. స్థలము మొదలైనవానిని గొలుచుటకు అంగుళము, అడుగు, గజము మొదలైనవి ప్రమాణములు. అటులనే వస్తువుల యొక్క మారకమును గొలుచుటకు డబ్బు ప్రమాణము. ఒకనివద్ద గోధుమలున్నవనుకొనుడు వానికి పంచదార కావలసినచో గోధుమలను పంచదారగలవానికిచ్చి, వాని వద్దనుంచి తాను పంచదారను తీసికొనవలయును. పంచదార గలవానికి గోధుమలతో అవసరమున్న యెడల, వాడు గోధుమలను తీసుకొని దానికి బదులుగా పంచదార నొసగగలడు. ఇదియే వస్తువుల యొక్క మారకము లేక వినిమయము. పైనచెప్పిన దృష్టాం

తమున పంచదార గలవానికి గోధుమలతో పని లేకున్నచో, గోధుమలు గలవానికి పంచదారతో పనియున్నను, పంచదార లభింపనేరదు. అట్టి స్థితిలో మరి యొకనివద్ద కందులున్న వనుకొనుడు, వానికి గోధుములు కావలయు ననుకొనుడు. పంచదారగలవానికి కందులుకావలయు ననుకొనుడు. అప్పుడు గోధుమలుగలవాడు, తన గోధుమలను కందులుగల వానికిచ్చి, వానివలన కందులు తీసుకొని, ఆకందులను పంచదారగలవానికిచ్చి, వానివలన పంచదారను తాను తీసికొనవలయును.

గోధుమలుగలవాడును, కందులుగలవాడును, పంచదారగలవాడును దూరప్రదేశములలో నివసించుచుండిన యెడల, నావస్తువుల నాదూరప్రదేశములకు గొంపోవుట చాల దుర్లభము. అదిగాక గోధుమలను యేరేటుప్రకారము కందులకు బదులు యివ్వవలయునో, యేరేటు ప్రకారము కందులను పంచదారతో మారకము చేయవలయునో అను విషయమున గూడ చిక్కులు తటస్థించును. అదిగాక ఎప్పుడు గోధుమలుగలవాడు తనగోధుమలను అమ్మజూవునో ఆసమయముననే కందులుగలవానికి కందులనమ్మ అవసరమున్ను; గోధుమలు కొననవసరమున్ను ఉండవలెను. ఆ తరుణమున గోధుమలతో అవసరము లేకున్నచో, అవసరమువచ్చువరకు వానిని నిలవచేసియుంచుట కష్టము. నిలవచేసినచో కాలము

గడచినకొలది యవి పుచ్చిపోవును. కాన ఆర్థికవ్యవహారములకై మారకమునందు గోధుమలు మొదలైన వస్తువులనే వినియోగము చేయునెడల పైచెప్పినరీతిగా కష్టములు పెక్కులు సంభవించును.

ఈ కష్టములు నివారించుకొనుటకై మానవులు డబ్బు అను సాధనమును కనిపెట్టిరి. డబ్బుఅనునది ఉన్నయెడల దానితో, కావలసిన వస్తువును దేనినైనను సంపాదించవచ్చును. అట్టి సాధనమునే డబ్బు అని అందురు. దాచుకొనుటకు గూడ డబ్బు చాల వీలుగానుండును. గోధుమలు మొదలైన వానివలె త్వరగా నశించిపోదు. ప్రతివస్తువునకు డబ్బుతో విలువ కట్టిన యెడల వినిమయమునందు చాల సౌకర్యముండును. ఈ కారణములవలన డబ్బు అను సాధనమును మానవులు సృష్టించిరి. కృష్ణాజిల్లాలో ఉన్నవాడు తనగోధుమలను అమ్మజూపినయెడల గుంటూరు జిల్లావాడు అందుకు బదులుగా తన కంచములను యివ్వదలచినచో, డబ్బు అనుసాధనము లేకున్నయెడల కంచములను ఎంతోదూరము తాను మోసికొని రావలసియుండును. డబ్బుఅనునది ఉన్నయెడల కృష్ణాజిల్లావానికి డబ్బు పంపినచో చాలును. కందులు పంపుటకంటె డబ్బుపంపుట తేలిక. ఇట్టి సౌకర్యములను పెక్కింటిని సమకూర్చునుగాన డబ్బు అను దానికి మిగుల ప్రాముఖ్యము వచ్చినది. డబ్బు అనునది యే రా

వమున నుండవలయునను సమస్య రాగా, లోహముతో చేయ బడిన నాణెముల రూపముగా నుండిన బాగుండునని పూర్వు లకు తోచినది. ఆలోహములలో యేలోహము మంచిదని వారు విచారించి వెండి బంగారములను నిర్ణయించిరి. అం దులో బంగారమునకే విశేషముగా ప్రాధాన్యము వచ్చినది.

అందఱును అంగీకరింపతగిన వస్తువు యేదైనను డబ్బు గా ప్రచారములో నుండుటకు ఉపయోగపడును. ఆ వస్తు వునందు సహజముగా కొన్ని గుణములున్ననేగాని ఆవస్తువు అందఱిచే పరిగ్రాహ్యము కాదు. త్వరలో నశించి పోక యుండవలెను. ఒకచోటనుంచి మరియొకచోటికి తీసికొని పోవుటకు వీలుగానుండవలెను. దాచుకొనుటలో సౌకర్య ముండవలెను. విభాగముచేయుటకు వీలుగానుండవలెను. (ఆవు, లేక ఎద్దును మనుష్యులు డబ్బుగా పరిగ్రహించిన యెడల, అర్ధ ఆవు- పాతిక ఆవును చేయుటకు వీలుండదు.) ఆ వస్తువు ఒకవేళ డబ్బుగా పరిగణింపబడక పోయినచో యితరపనులకు దేనికైనను వినియోగించునదిగా నుండవలెను. పైచెప్పినగుణములు విశేషముగా నుంటచేత, వెండిబంగార ములు డబ్బునకు ఆధారభూతములైనవి. అందులో బంగా రము సర్వదేశవాసులచే నంగీకరింపబడి యున్నది. ఇట్టి వెండిబంగారములచే నాణెములనునవి చేయబడి ప్రచార ములో నున్నవి. తద్వారా మనుష్యులు పరస్పరము వ్యవహా

రముల సాగించుచున్నారు. ఇట్టినాణ్యరూపమైన డబ్బు లేకున్నచో, మనుష్యులలో నిన్ని వ్యవహారములు సాగుటకు వీలుండెడిదికాదు. అట్టివీలులేకయున్నచో యిపుడున్న నాగరికస్థితి ప్రపంచమునకు వచ్చెడిదికాదు.

రానురాను మనుష్యవ్యవహారములు వృద్ధినందసాగెను. మనుష్యవిజ్ఞానము పెరిగినకొలదియు, ధూమశకటములు పొగయోడలు, వాయు విమానములు మొదలైనవి ప్రబలెను. పూర్వమువలె మనుష్యులకు యేదోయొకచోట కడుపులో చల్ల కదలకుండ వ్యవహరించుకునే కాలము పోవుటచేత దూరదేశములతో, దూరదేశవాసులతో, భవిష్యత్కాల సంబంధముతో పరస్పరము వ్యాపారములు ప్రబలెను. ఆర్థికములైన వ్యాపారములన్నింటికి డబ్బు కావలసివచ్చెను. కుర్చీచేయువాడు తన ఆహారమునకై ధాన్యము పండించు రైతునకు డబ్బు యివ్వవలసివచ్చెను. ఆరైతు తనవ్యవసాయమునకై మరొకనివద్ద నాగలి కొని వానికి డబ్బు యివ్వవలసి వచ్చెను. ఈ విధముగా ఎన్నివ్యవహారములు జరుగునో అంత డబ్బు కావలయును. "ఏ" అనువాడు "బి" అను వానికి కుర్చీకొన్నందుకు పది రూపాయిలు యివ్వవలయు ననుకొందము. "బి" అనువాడు ధాన్యమునమ్ము "సి" అను వానికి పదిరూపాయిలున్ను "సి" అనువాడు నాగలికిగాను "డి" అనువానికి పన్నెండురూపాయిలున్ను యివ్వవలయు

ననుకొందము. ఈ వ్యవహారములన్నియు డబ్బుద్వారా పైసలు కావలసినచో అధమము పన్నెండురూపాయిలైనను చెలామణిలో నుండవలెను. "ఏ" "బి" కి పదిరూపాయిలు యిచ్చును. "బి" "సి" కి పదిరూపాయిలు యిచ్చును. "సి" "డి" కి పన్నెండురూపాయిలు యిచ్చును. ఇందులో "ఏ" వల్ల పుచ్చుకొన్న పదిరూపాయలనే "బి" "సి" కి యిచ్చినాడను కొందము. వానినే "సి" "డి" కి యిచ్చుటకు తనవద్దనున్న యింకా రెండు రూపాయలను కలిపి యివ్వవలయును. వెంట వెంటనే "ఏ" వల్ల "బి" కిన్ని; 'బి' వల్ల 'సి' కిన్ని; డబ్బు వసూలగుచో పన్నెండురూపాయలతో యీ వ్యవహారములు నాగును. లేకున్న ముప్పదిరెండురూపాయలు కావలసి వచ్చును. 'సి' తనకు 'బి' వలన డబ్బురాకముందే 'డి' కి యివ్వవలసినచో పన్నెండురూపాయలు కావలయును. 'బి' తనకు 'ఏ' వల్లరాకముందే 'సి' కి యివ్వవలసివచ్చుచో పది రూపాయలు కావలెను. 'ఏ' 'బి' కి యిచ్చుటకు మరియొక పదిరూపాయలు కావలెను. వ్యవహారములు బొత్తిగా వీలు లేక నాగినచో ముప్పదిరెండు రూపాయిలున్నూ, బాగా వీలుగా నాగినచో పన్నెండురూపాయిలున్ను పై వ్యవహారము లకు కావలయును. ఇట్లు వ్యవహారముల నంతములగు చుం డగా నాణ్యరూపమైన డబ్బుకూడ మనుష్యులకు సరిపోలేదు. అందుచేత 'పరపతి' యనుసాధనమును మనుష్యులు కనిపెట్టిరి.

పైన చెప్పిన దృష్టాంతమునకు మరియొక వ్యవహార మునుకలిపి చూతము. ‹డి' అనువాడు ‹ఏ' అనువానికి యింటి అద్దెక్రింద పదిహేనురూపాయిలు యివ్వవలయు నను కొందము. పైజెప్పిన విధముగా రూపాయిలలోనే వ్యవహారము జరుగునెడల 47 రూపాయిలవరకు డబ్బుకావలసి వచ్చును. ‹సి' ‹డి' కి పన్నెండు రూకలు యిచ్చెను. ‹బి' ‹సి' కి పది రూపాయిలు యిచ్చెను. ‹ఎ' ‹బి' కి పది రూపాయిలు యిచ్చెను. అప్పటికి 32 రూపాయలకు పని తగిలెను. అప్పటికి ‹డి' వద్ద 12 రూపాయలు ఉన్నవి. ‹డి' అద్దెక్రింద ‹ఎ' కు యివ్వవలసిన 15 రూపాయిలలో తనవద్దనున్న 12 రూపాయిలుగాక మిగతా 3 రూపాయిలు యివ్వవలెను. అట్లగుచో 32 + 3 కలిసి 35 రూపాయిలకు పనితగిలెను. లేక "డి" "ఎ" కు 15 రూపాయిలున్ను "సి" "డి" కి 12 రూపాయిలున్ను "బి" "సి" కి 10 రూపాయిలున్ను యిచ్చినయెడల "ఎ" తనకు "డి" యిచ్చిన 15 రూపాయిలలో నుంచి "బి" కి తాను పది రూపాయిలు యివ్వవచ్చునుగాన చెలామణిలో 27 రూపాయలు కావలసివచ్చును. అట్లుగాక "ఎ" తనకు "డి" యిచ్చిన 15 రూపాయిలున్ను తాను "బి" కి యివ్వక ముందు ఖర్చుపెట్టినచో "బి" కి యిచ్చుటకు వేఱే పది రూపాయిలు కావలెను. అట్టి స్థితిలో మొత్తము 47 రూపాయిలు కావలసివచ్చును. అన్ని రూపాయిలలో అవసరము

లేకుండా వ్యవహారముల జరుపుటకై "పరపతి" యనునది సృజింపబడెను.

"ఏ" తాను "బి" కి యివ్వవలసిన 10 రూపాయిలకు ఒక ప్రామిసరీనోటును వ్రాసియిచ్చినా డనుకొందము. ఆ నోటును "బి" తాను "సి" కి యివ్వవలసిన బాకీ క్రింద ఆర్డరువేసి యిచ్చెననుకొందము. ఆ నోటు నున్ను మరి యొకనోటును రెండు రూపాయిలకు వ్రాసి దానిని "డి" కి యివ్వవలసిన బాకీ క్రింద యిచ్చెననుకొందము. "డి" తాను "ఏ" కి యివ్వవలసిస పదిహేనురూపాయిల క్రింద ఆ రెండు నోట్లు నున్ను ఆర్డరు వేసి యిచ్చుచో యింకా మూడు రూపాయిలు మాత్రము రొఖముగా యివ్వవలసి యుండును. ఆ విధముగా పై వారందరు బాకీలుసరిపెట్టు కొన్నచో 3 రూపాయిలు మాత్రమే రొఖము కావలయును. అయితే "ఏ" యందు 'బి' కిన్ని 'బి' యందు 'సి' కిన్ని 'సి' యందు 'డి' కిన్ని నమ్మకముండవలయును. ఆ నమ్మకమునకే 'పరపతి' యనిపేరు. 'ఎ' 'బి' కి రొఖము బదులుగా తన పరపతిని యిచ్చినాడు. అటులనే 'బి' 'సి' కిన్ని 'సి' 'డి' కిన్ని పరపతి నిచ్చి బాకీలను సరిపెట్టుకొని వ్యవహారములు సరిగా చేసుకున్నారు. ఈ పరపతి నమ్మకము మీాద ఆధారపడియున్నది. ఎ' తననోటు ప్రకారము సకాలమునకు రొఖము నష్లయి

చేయ గలడను ధైర్యమున్ననే గాని 'బి' తనబాకీ క్రింద 'ఎ' వల్ల నోటును తీసికొనడు. అటులనే మిగిలిన వారలున్న కాన, పైయుదహారణమువలన, రొఖముగా 47 రూపాయిలు కావలసిన వ్యవహారములను 3 రూపాయలతో చేయుటకు అవకాశముకలిగెను.

వెండితోగాని బంగారముతోగాని చేయబడిన నాణె ములను ఆయా దేశములలోని ప్రభుత్వములవారు ప్రచార ములోనికి దెత్తురు. మనుష్యవ్యవహారములు విరివిగా సాగిన కొలదియు ఈ నాణెములు సరిపోలేదు. అందు వలన పరపతి యనునది సృజింపబడినది. దీనినే ఆధారముగా జేసికొని, ఆయా దేశములలోని ప్రభుత్వములవారు గాని, గవర్న మెంటు వారివలన అధికారమును బొందిన బ్యాంకువారు గాని, కరెన్సీ నోట్లను ప్రచారములోనికి దెచ్చిరి. ఈ నోట్లు గూడ, ఆ ప్రభుత్వము యొక్కగాని, బ్యాంకు యొక్కగాని, పరపతిమీదనే ఆధారపడియున్నవి. కరెన్సీ నోట్లయందు యీ క్రిందివిధముగా వ్రాయబడియుండును. 'ఈ నోటును తీసికొని వచ్చి నోట్లు ముద్రించు ఆఫీసువారికి చూపించి కావలయునన్నయెడల యింతఎత్తువెండి బంగారములు గాని యిన్నినాణెములుగాని యివ్వబడును.' అట్టి వాగ్దానమును ప్రభుత్వమువారుగాని బ్యాంకువారుగాని చేయుటవల్ల, వారి

పరపతి నాధారముగా జూచుకొని ప్రజలు కరెన్సీ నోట్లను నాణెములతో సమానముగా చూచుకొనుచున్నారు. అట్లు నాణెములుగాని, లోహముగాని, యివ్వబడునని నోట్లయందు వాగ్దానమున్నను, నోట్లుకలవారందరు ఒక్కుమ్మడి తమ నోట్లకు బదులు, నాణెములగాని, లోహముగాని యిమ్మనుట తటస్థింపదు, అను ధైర్యమువలన సామాన్యముగా ప్రతి దేశములోను కరెన్సీనోట్ల నమలులోనికి దెచ్చుచున్న ప్రభుత్వమువారుగాని, బ్యాంకువారుగాని, నోట్ల మొత్తమునకు చాలినన్ని నాణెములుగాని లోహమునుగాని, తమ యొద్ద నుంచుకొనుట లేదు. నూటికి నలుబది వంతులు, ఏబదివంతులకు నాణెములుగాని, బంగారముగాని వెండిగాని వారి బొక్కసమునందుండును. ఆధైర్యము పూర్తిగానున్నచో అనగా ఎవరును ఎప్పుడును నోట్లను బదులు నాణెములుగాని, లోహమునుగాని కోరరు అను ధైర్యమున్నచో వారి బొక్కసమునందు నాణెములగాని, వెండి బంగారములగాని ఉంచుకొన బనిలేదు. ఆధైర్యము పూర్తిగా లేకుండుటవలనను కొంతమట్టునకైనను, లోహముగాని నాణెములుగాని వారి వద్దనున్న యెడల ప్రజలయందు నోట్లవిషయమై నమ్మకముండుననను అభిప్రాయమువలనను పైచెప్పిన విధముగా నోట్లకు ప్రత్యామ్నాయముగా వారి బొక్కసములందు నాణెములగాని లోహముగాని సమకూర్చి యుంచుకొనుచున్నారు.

కాబట్టి ప్రస్తుతకాలమున, నోట్లు కూడ నాణెములవలెనే పూర్తిగా ప్రచారములోనుండుట ప్రతి వానికిని తెలిసిన విషయమే. ఈ కరెన్సీనోట్లవలన నలుబది నాణెములకు తగినంత లోహమున్నచో, నూరు రూపాయలవరకు డబ్బును ప్రచారములో బెట్టవచ్చును అని తేలినది. నోట్లు గూడా లోహపు నాణెములతో సమానమైనవి గనుక వానికికూడా డబ్బు అనియే నామము. అందుచేత లోహముయొక్క ఉప యోగమును వాడుకను తగ్గించుటకు నోట్లు సాధనము లగుచున్నవి.

ఈ కరెన్సీనోట్లు కూడ చాలనంతవ్యవహారములు రానురాను మనుష్యులలో సాగ మొదలిడెను. వాని యన్ని టికిని చాలినంత వెండిబంగారములుగాని, దాని సాధారణ ముగా జేసికొని ముద్రించబడిన కరెన్సీనోట్లుగాని లేక పోయెను. తిరిగి "పరపతి" యే ఆధారమయ్యెను. ఈ పరపతిని తయారుజేయునవే బ్యాంకులు.

రొక్కము యివ్వకయే "ఏ" "బి" "సి" "డి" ల మధ్య ప్రామిసరీ నోట్లతో వ్యవహారము సాగించినచో పరపతి తయారు జేయబడినదగునని పైన వివరింప బడియెను. వారు ఒకరినొకరు ఎరిగియున్నవారై ఆర్థికముగా మంచి

స్థితిలోనున్నచో పై జెప్పిన ప్రోనోటు పద్ధతి వీలగునుగాని, ఎఱుగని వారై దూరదేశములందున్నచో ఒకరి పరపతి యందు మఱియొకరికి అంతనమ్మక ముండదు. ప్రస్తుత కాలమున పరస్పరవ్యవహారములు బహుదూరస్థులకు జరుగు చున్నవి. మనకు కావలసినవస్త్రములు బొంబాయిలోనున్న యే బిర్లా కంపెనీవారి వద్ద నుండియో వచ్చుచున్నవి. మన గ్రామములో వర్తకులనేకులా వస్త్రముల తెప్పించుచున్నారు. ఇచటి వర్తకులు ధనవంతులై యుండవచ్చును; ఉండక పోవచ్చును. ధనవంతులైనను వారి సంగతి బొంబాయి వారికి తెలియకపోవచ్చును. అటులనే యింకా దూరదేశ ముల వ్యాపారములలో ఒకరి పరపతియందు మరొకరికి అంతగా నమ్మకముండదు. పై ఉదాహరణమున "బి" అను వాడు బొంబాయి వర్తకుడనియు "ఎ" అనువాడు చెన్నపట్ట ణపు కాపురస్థుడనియు గ్రహింతము. "ఎ" సంగతి "బి" కి పూర్తిగా తెలియకపోవచ్చును. చెన్నపట్టణములో నొక వ్యక్తిగాని లేక వ్యక్తిసముదాయముగాని బహుకాలమునుంచి పెద్దప్రతిష్ఠతో వడ్డీ వ్యాపారము చేయుచున్నదను కొనుడు. "ఎ" తాను "బి" కి యివ్వవలసిన బాకీ క్రింద ఈ వడ్డీ వ్యాపారస్థుని ఆవార్తీ చేసినచో "బి" అంగీకరింపవచ్చును. ఈవడ్డీవ్యాపారస్థుని వర్తకముఅప్పులుయిచ్చుట,పుచ్చుకొనుట. ఈ వ్యవహారము నతడు నిపుణతతో చేసి లాభముసంపాదిం

చును. వానికి లేక వారికి బ్యాంకు అని పేరు. ఈ బ్యాంకులు విరివిగా పెద్ద మొత్తములతో విశేషానుభవముతో వ్యాపారము జేసి పెద్ద ప్రతిష్ఠ సంపాదించునుగాన, ఈ బ్యాంకులు వ్రాసియిచ్చిన నోట్లుగాని, ఈ బ్యాంకులు ఒప్పుదలయైన పత్రములుగాని, ఈ బ్యాంకులు అవాస్త్రీ చేయుచు వ్రాసే ఉత్తరములుగాని సామాన్యముగా దూరదేశస్థులు గూడ తమ బాకీ క్రింద గ్రహింతురు. "ఏ" బొంబాయి వర్తకుడగు "బి" కి బాకీపడి రొఖము పంపుటకు బదులు ఒక బ్యాంకు మీద ఉత్తరము వ్రాసి ఆ ఉత్తరమును బ్యాంకుచేత ఒప్పించి "బి" కి పంపినచో "బి" దానిని అంగీకరించును. "ఒకరికిగాని, ఒకరి ఆర్డరుకుగాని ఉదాహరింపబడిన మొత్తమును యిమ్మ"ని వ్రాయు ఉత్తరమునకే బిల్లు అనియు, హుండీయనియు, చెక్కు అనియు పేరు. బ్యాంకు మీద వ్రాయబడి, చూపించిన వెంటనే డబ్బు యివ్వవలసిన బాధ్యతగల ఉత్తరమునకు చెక్కు అని పేరు. బిల్లు అన్నను హుండీ అన్నను ఒక్కటే. ఇవి సామాన్యముగా బ్యాంకులమీదగాక, వ్యక్తులమీద వ్రాయబడి కొన్ని రోజులతరువాత రొఖము యివ్వవలసిన బాధ్యతగలవిగా నుండును. చూపించిన వెంటనే రొఖము యివ్వవలసిన బాధ్యతగల హుండీలు గూడగలవు. వానినే దర్శనహుండీలు అని అందురు. ఇంగ్లాండు నుంచి ఒక వర్తకుడు యినప

సామ్మానును బొంబాయిలో నొక వర్తకునకు పంపెననుకొందము. అందులకై ఇంగ్లాండు వర్తకుడు తనకు గాని తనతరఫున వేఱొకనికిగాని తనకు రావలసిన మొత్తమును యివ్వవలసినదిగా బొంబాయి వర్తకునికి వ్రాసిపంపిన యుత్తరము బిల్లు అనబడును. ఇట్టి బిల్లులవల్లగాని చెక్కులవల్ల గాని, చాలా లాభములు గలవు. రొఖములేకుండా వ్యవహారములు సాగించుట ఒకటి; డబ్బు పంపకయే దూరదేశములోని బాకీలు సరిపెట్టుట రెండు; ఈ బిల్లు రూపముగా గాని, చెక్కు రూపముగాగాని తీర్చబడిన బాకీలకు లెఖ వ్రాయుట మూడు. పూర్వము చెప్పిన "ఏ" "బి" "సి" "డి" దృష్టాంతమున "ఏ" వ్రాసిననోటు తిరిగి 'ఏ' వద్దకువచ్చుట చేత రొఖముతో అవసరము లేకపోయినది. ఈ బ్యాంకుల వల్ల అట్టిస్థితి సంభవించును. ఈ బ్యాంకులకు యితర ప్రదేశములలో బ్రాంచి ఆఫీసులుగాని, యితర పరదేశములలోని బ్యాంకులతో కాతాగాని వుండును. మనము బొంబాయిలో నొకనికి డబ్బు పంపవలసివచ్చే యెడల, ఆడబ్బును బొంబాయికి పంపునట్లు ఆంధ్రబ్యాంకువారితో మనము యేర్పాటుచేసుకొనవచ్చును. మనకు ఆంధ్రబ్యాంకులో కాతా యున్నదనుకొనుడు. ఎంత మొత్తము మనము పంపదలచితిమో అంత మొత్తమును ఆంధ్రబ్యాంకువారు మనఖాతాలో ఖర్చు వ్రాసికొని బొంబాయిలో తమకు కాతావున్న యే సెంట్రలు

బ్యాంకువారి మీఁదికి ఒకచెక్కు వ్రాసి మనము బాకీవున్న బొంబాయి వర్తకునికి పంపెదము. వాఁడు సెంట్రిలుబ్యాంకులో నాచెక్కును మార్చుకొనును. వర్తకవ్యాపారముల అనుభవముగలవారు అట్టి చెక్కును గ్రహించెదరు. సెంట్రలు బ్యాంకువారు తమవద్ద ఆంధ్రిబ్యాంకు కాతాలో ఖర్చు వ్రాయుదురు. ఖర్చువ్రాసి అతనికి రొఖము యిత్తురు. బొంబాయి వానికి సెంట్రిలు బ్యాంకులో కాతావున్న యెడల వానికి రొఖము యివ్వకయే ఆమొత్తము అతని కాతాలో జమ వ్రాయబడును. ఇందుమూలమున డబ్బును బొంబాయి వరకు యే ఇన్సూరుద్వారానో పంప నవసరములేకపోవును. అంతకంటె బ్యాంకువారు తక్కువ చార్జీకి బాకి సరిపెట్టు ఏర్పాటుచేయుదురు. మనడబ్బు ఆంధ్రిబ్యాంకులోనిది ఖర్చు అయినట్లున్ను, సెంట్రలుబ్యాంకువారు బొంబాయి వర్తకునికి డబ్బుయిచ్చినట్లున్ను, ఆంధ్రిబ్యాంకువారు సెంట్రిలుబ్యాంకువారికి అంత మొత్తము బాకీ యున్నట్లున్ను పుస్తకములలో వ్రాయబడియుండును.

నాణెములతోగాని, కరెన్సీనోట్లతోగాని అవసరములేకుండా బ్యాంకులు పరపతిని తయారుజేసి వ్యవహారములను సాగునట్లు చేయుననుట ఎట్లు అని శంక కలుగవచ్చును. 'ఏ' 'బి','సి','డి' లకు ఒక బ్యాంకుతో కాతా వున్నదని

భావింతము. ‘ఎ’ ‘బి’ కి యివ్వవలసిన పదిరూపాయలు రొఖముగా యివ్వక బ్యాంకుమీద చెక్కుయిచ్చును. “బి” ఆ చెక్కును ‘సి’ కిన్ని, ‘సి’ ‘డి’ కిన్ని ‘డి’ ‘ఎ’ కిన్ని ట్రాన్సు ఫరు చేయవచ్చును. లేదా ‘బి’ ఆచెక్కును బ్యాంకులో యిచ్చినచో బ్యాంకువారు ఆపది రూపాయలను ‘ఎ’ కాతా లో ఖర్చువ్రాసి ‘బి’ కాతాలో జమకట్టుదురు. ‘బి’ ‘సి’ కి యిచ్చిన చెక్కును ‘సి’ బ్యాంకులో యిచ్చినచో, ఆ మొత్త మును ‘బి’ కాతాలో ఖర్చువ్రాసి ‘సి’ కాతాలో జమ కట్టుదురు. అటులనే ‘సి’ ‘డి’ కి యిచ్చిన చెక్కును, ‘డి’ ‘ఎ’ కు యిచ్చిన చెక్కును జమ ఖర్చు చేయబడును. ఇట్లు జమ ఖర్చు చేయుట మూలమున రొఖముతో నిమిత్తములేకయే వ్యవహారములు సాగునట్లుగా బ్యాంకులు చేయుచున్నవి. ‘ఎ’ కు ఆంధ్రబ్యాంకులోనున్న ‘బి’ కు హిందూస్థానీ బ్యాంకులోనున్న కాతా వున్నదనుకొందము. ‘ఎ’ ‘బి’ బాకీ క్రింద ఆంధ్రిబ్యాంకు మీదచెక్కుయిచ్చును. ఆ చెక్కును ‘బి’ తన హిందూస్థానీబ్యాంకులో యిచ్చును. ఆచెక్కును బట్టి పదిరూపాయిల మొత్తమునకు హిందూ స్థానీ బ్యాంకువారికి ఆంధ్రిబ్యాంకు వారిమీద హక్కు ఉండును. ‘డి’ కు హిందూస్థానీబాంకుతో కాతా వున్న దనుకొందము. తాను ‘ఎ’ కు యివ్వవలసిన పదిహేను రూపాయిలకిృంద హిందుస్థానిబ్యాంకు మీద చెక్కువ్రాసి

'ఎ' కు యిచ్చును. 'ఎ' ఆచెక్కును ఆంధ్రిబ్యాంకు వారికి యిచ్చును. ఆమొత్తమునకు ఆంధ్రిబ్యాంకువారికి హిందూస్థానీబ్యాంకుమీద హక్కువుండును. వ్యవహారములలో ఆబ్యాంకువారిమీద చెక్కులు యీ బ్యాంకు వారి వద్దను యీ బ్యాంకువారిమీద చెక్కులు ఆబ్యాంకువారివద్దను వుండును. ఒకనాడు వారును వీరునుకలిసి, వారికి వీరివ్వవలసినదియు, వీరికి వారివ్వవలసినదియు లెఖ చూచుకొని తేలేబాకీ మాత్రిము ఒకరికి ఒకరు రొఖరూపేణ యిచ్చుకొందురు. ఈ విధముగా లక్షలకొలది వ్యాపారము వందల రూపాయీల రొఖముతో చేయుటకు వీలుకలుగుచున్నది. ఇట్లు చేయుటకు బ్యాంకులవల్ల కలిగిన పరపతియే ఆధారమగుచున్నది.



# రెండవ అధ్యాయము



మనుష్య వ్యవహారములకు డబ్బు అవసరమనియు, డబ్బు చాలకపోయినందువల్ల పరపతి యనునది మానవులచే సృజింపబడెననియు, ఆపరపతి బ్యాంకుల వల్లనే విరివిగా తయారు చేయబడుచున్నదనియు పై యధ్యాయమున వివరింపబడియెను. బ్యాంకులు లేనిది, మనుష్య వ్యాపారములు విరివిగా సాగుటకు వీలులేదని తేలినది. కావున బ్యాంకులనునవి దేశౌన్నత్యమునకు పునాదులు. ఈ బ్యాంకులయొక్క ఉపయోగమునుగూర్చి యింకనొక విషయమును జెప్పెదను. ఇంగ్లాండులోని వర్తకుడు ఆస్ట్రేలియా వర్తకుని వద్దనుంచి గోధుమలు కొన్నాడనుకొందము. ఈ గోధుమలు ఇంగ్లాండునకు జేరి వానిని ఆవర్తకుడు అమ్ముకొన్ననే గాని వానికి రొఖము సమకూరదు. రొఖముసమకూరిననే గాని వాడు ఆస్ట్రేలియా వర్తకునకు సొమ్మియ్యలేడు. డబ్బుముందు పుచ్చుకొనకుండా, తన గోధుమలను ఇంగ్లాండునకు పంపుటకు ఆస్ట్రేలియా వర్తకుడు సమ్మతింపడు. ఈ గోధుమలు సముద్రముమీాద ఇంగ్లాండుజేరి అక్కడి వర్తకుడు వానిని అమ్మి సరికి

యేమూడు నెలలో పట్టును. అంతవరకు ఆస్ట్రేలియా వర్త కునికి వ్యవహారము సాగు టెట్లు. ఈ చిక్కును సమర్థించు టకై బిల్లు లను పరపతి కాగితములు బయలుదేరినవి. గోధు మలక్రింద ఆస్ట్రేలియా వర్తకునికి నూఱు పౌనులు రావలెనను కొనుడు. అతడు నూఱు పౌనులు తనకుగాని తన ఆర్డరుకు గాని మూడు మాసముల దరిమిలా యివ్వవలసినదిగా ఇం గ్లాండు వర్తకునిమీద బిల్లు వ్రాసి పంపి గోధుమలను ఓడ మీద ఎక్కించును. ఓడవారు రశీదును యిత్తురు. ఈబిల్లు నతడు ఇంగ్లాండునకు పంపును. ఇంగ్లాండు వర్తకుడు దానిని అంగీకరించును. అది తిరిగి ఆస్ట్రేలియాకు వచ్చును. వచ్చిన వెంటనే యీ బిల్లునున్ను, రసీదునున్ను బ్యాంకువారికి యిచ్చి నయెడల బిల్లు రొఖముగా మాఱునాటివరకు అగు వడ్డీయున్ను వారి కమీషనున్ను మినహాయించుకొని మిగిలిన మొత్తమును ఆస్ట్రేలియా వర్తకునికి యిచ్చి తాము బిల్లునుకొందురు. వడ్డీ క్రిందను, కమీషనుక్రిందను యేరెండుపౌనులో మినహాయిం చుకొని మిగిలిన 98 పౌనులను ఆస్ట్రేలియా వర్తకునికియిత్తురు గోధుమలు యింగ్లాండులోనికి వెడలి అక్కడ అమ్ముడుపోయి డబ్బు వచ్చువరకు ఆస్ట్రేలియా వర్తకుడు నోటిలో వ్రేలుపె ట్టుకొని కూర్చుండ నక్కరలేదు. ఈ బిల్లును బ్యాంకువారు వాయిదానాటికి వసూలుచేసికొందురు. లేదా యింకా ఎవ రైన కొనువారున్నయెడల లాభసాటిగా అమ్ముదురు.

ఆ కొన్నవారు వాయిదానాటికి ఇంగ్లాండు వర్తకునివద్దనుంచి సొమ్ము వసూలుచేసికొందురు. బ్యాంకులవంటి సంస్థలున్న నేగాని యిట్టి బిల్లులు ప్రచారములో నుండనేరవు. ఏలననగా యీబిల్లును తాము ఖరీదుచేయుటచేత ఇంగ్లాండులో వసూలు చేసుకోవలసిన బాధ్యత కలుగుచున్నది, బ్యాంకులవంటి పెద్ద సంస్థలకు తప్ప అట్టిపని సాధ్యముకాదు. ఇదివరకే వారికి అన్యప్రదేశములలో బ్రాంచిలుగాని, అన్యదేశ బ్యాంకులతో కాతాలుగాని ఉండునని వ్రాసియుంటిని. అందు వలన సులువుగా వారా బిల్లులోని బాకీని వసూలుచేసికొందురు

పైన జెప్పినట్లు ఆస్ట్రేలియా వర్తకుడు ఇంగ్లాండు వర్తకునిమీద బిల్లు వ్రాయుటయు, ఆ బిల్లు ఇంగ్లాండు పోవుటయు, వానివలన ఒప్పుకొనబడివచ్చుటయు అనుభవములో జరుగుటలేదు. ఇంగ్లాండు వర్తకునికి ఇంగ్లాండులో నొక పెద్ద బ్యాంకులో కాతా ఉండును. ఆ బ్యాంకువారికి ఆస్ట్రేలియాలో బ్రాంచి ఆఫీసుగాని, అక్కడ వేరొక బ్యాంకుతో కాతాగాని ఉండును. ఆ బ్యాంకుద్వారా తాను ఆస్ట్రేలియాలో యివ్వవలసిన మొత్తమును యిచ్చునట్లు యేర్పాటు చేసికొనును. ఆ మొత్తమును ఆస్ట్రేలియా వర్తకునికి యిచ్చునట్లుగా బ్యాంకు అంగీకరించును. ఆ బ్యాంకుయొక్క బ్రాంచిమీదనో, లేక కాతా సంబంధముగల వేఱొక బ్యాంకు

మీదనో ఆస్ట్రేలియా వర్తకుడు తనకు రావలసిన మొత్తము నకు బిల్లు వ్రాయును. ఆ బిల్లు ప్రకారము వారు డబ్బు యిత్తురు. లేదా ఆ బ్యాంకు అంగీకరించిన బిల్లుగాన దాని నే బ్యాంకువారైనను కొని డబ్బు నిచ్చెదరు. ఈ విధముగా వస్తువుల నమ్మువానికి వెంటనే రొఖము చేతిలో పడుటమూలమున వాడు ధైర్యముగా తన వస్తువులను దూరదేశములకు పంపుచున్నాడు. ఇందుచేత వర్తక వ్యాపారములు విరివిగా సాగుచున్నవి. ఇదికూడ పరపతిని తయారుచేయుటకు దృష్టాంతమే.

పై చెప్పినదానినిబట్టి బ్యాంకులవలన కలుగు లాభములు విశేషముగా నున్నవని తేటతెల్లము కాగలదు. అట్టి బ్యాంకులకు శిరఃప్రాయమైన రిజర్వు బ్యాంకు ఎందుకువలయునో, దానివలన ప్రయోజనములెవ్వియో యించుక వివరించెదను.

కరెన్సీనోట్ల పద్ధతికూడ పరపతిలో అంతర్భాగమనియు పరపతిని తయారుచేయువారు బ్యాంకులనియు, కరెన్సీనోట్లు ముద్రించువారు గవర్నమెంటువారుగాని, లేక పెద్దబ్యాంకు వారుగాని అయియుందురనియు వ్రాసియుంటిని. అయితే కరెన్సీనోట్లు కేవలము నాణెములవలె రొఖముగా చలామణిలో

నుండును. బిల్లులు, హుండీలు, చెక్కులు మొదలయినవి వ్యాపారానుభవము గలవారిలో మాత్రము బాగా చలామణిలో నుండునుగాని, సామాన్యులలో నంతగా నుండవు. కరెన్సీనోట్లకు నాణెములుగాని, లేక నాణెములయందుండు లోహములుగాని ఆధారమని తెలుపబడియెను. అటులనే కరెన్సీనోట్ల రూపేణ లేకుండెడి పరపతికి (అనగా బిల్లులు చెక్కులు హుండీలు మొదలయినవాటికి) కరెన్సీనోట్లు ఆధారము. బ్యాంకులవారు పరపతి నిచ్చుచున్నారనగా కేవలము వారు రొఖ మిచ్చినయెడల అది పరపతిగాదు. నాణెములుగాని నాణెములతో సమానమైన కరెన్సీ నోట్లుగాని వా రిచ్చుచో నిజముగా వారు పరపతిని తయారుచేయుదురు. మనము ఒక బ్యాంకువద్దకు వెళ్ళి అప్పు కావలయునని అడిగినచో వారు నాణెములగాని, కరెన్సీనోట్లనుగాని యిచ్చుచో వారు పరపతిని నిర్మించుటలేదు. అట్లుగాక మనము యెవరికైనను బాకీపడుచో ఆ బాకీలను వారు అచ్చుకొన్నయెడల అప్పుడు పరపతి నిర్మింపబడినదగును. ఈ బ్యాంకులయందు మన బాకీదార్లకు నమ్మకమున్ననేగాని, బ్యాంకులయొక్క అవా ల్తీకి మన బాకీదారులు ఒప్పుకొనరు. బ్యాంకులయందు నమ్మకముగా మన బాకీదారులకు డబ్బు కావలసివచ్చేటప్పుడు మనము అవాల్తీజేసిన బ్యాంకువారు రొఖమును వెంటనేకీ స్లాయి చేయగలరను నమ్మకము బ్యాంకుయందు మన శా

బాధ్య కుంటయే. ఆ నమ్మకము ఎట్లు వచ్చును. బ్యాంకు బాగా అనుభవముతో పని చేయుట యొకటి. ఎప్పుడు రొఖము కావలెనని అడిగితే వారు రొఖము యిచ్చుట రెండు. ఏ ఒక సమయ మందైనను వారు రొఖము యివ్వలేకున్నచో వారియందు నమ్మకము చెడును. వారి అవాప్తిని మన బాకీదారులు అంగీకరింపరు. అవసరమువచ్చి అడిగినప్పుడు రొఖము యిచ్చుటకుగాను బ్యాంకువారివద్ద కొంతవరకు నాణెములుగాని తత్తుల్యమైన కరెన్సీనోట్లుగాని ఉండవలెను సామాన్యముగా లోకానుభవమునుబట్టి నూటికి సలభై వం తులు నోట్లుగాని నాణెములుగాని బ్యాంకులవారు తమవద్ద నుంచుకొనుచున్నారు. బ్యాంకులు ఒకవేళ పరపతిని ఎక్కువ చేయ దలచుకొన్నచో వారివద్ద ఎక్కువగా నాణెములుగాని నోట్లుగాని వుండవలెను. బ్యాంకులు పరపతిని ఎక్కువచేయ దలచుకొన్నప్పుడు కరెన్సీనోట్లను ముద్రించువారుకూడా యీ బ్యాంకులకు సహాయముగా ఎక్కువ కరెన్సీనోట్లను ముద్రించవలసియుందురు. పరపతిని బ్యాంకులవారు తగ్గించుచో నోట్లను ముద్రించువారుకూడా నోట్లను పరిచారము లోనుంచి తగ్గించవలయును. ఏలననగా పరపతి యనునది నాణెములమీదగాని తత్తుల్యమైన కరెన్సీ నోట్లమీదగాని ఆధారపడి యుండుటచేత, కరెన్సీ ముద్రించువారికిన్ని పరప తిని తయారుచేయువారికిన్ని పరస్పర సాహాయ్య ముండ

వలెను. అట్టి సాహాయ్యము ఈ రెండు సంస్థలును (అనగా పరపతిని తయారుచేయు సంస్థయున్ను, కరెన్సీ నోట్లను ముద్రించు సంస్థయున్ను) ఒకే జాతికి చెంది అన్యోన్యాశ్రయములై యుండవలెను. లేకున్న చిక్కులు తటస్థించును.

వర్తక వ్యాపారములు విరివిగా సాగుచున్నకాలమున డబ్బు విశేషముగా కావలయును. అట్టి స్థితిలో రొఖము బదులు బ్యాంకులు పరపతిని తయారుచేసి వ్యాపారములను సాగునట్లు చేయును. అది యే విధముగా జరుగునో పైన వివరింపబడి యుండెను. నాణెములుగాని కరెన్సీనోట్లుగాని పరపతిగాని వర్తకవ్యాపారములు బాగుగా సాగుచున్నప్పుడే విరివిగా కావలయును. లేకున్న అక్కరలేదు. పయిన చెప్పినదానినిబట్టి పరపతికి కరెన్సీనోట్లున్ను, కరెన్సీనోట్లకు నాణెములు లేక లోహము ఆధారమని నిరూపింపబడినది. పరపతి యెక్కువగా బ్యాంకులు తయారుచేయవలసి వచ్చిన ప్పుడు కరెన్సీనోట్లు ఎక్కువగా వారికి కావలయును. అట్టి నోట్లయొక్కగాని నాణెములయొక్కగాని ఆధారములేనిది పరపతిని వృద్ధిచేయుటకు ఏ బ్యాంకువారును సమ్మతింపరు. అట్టి యాధారములేకుండ పరపతిని వృద్ధిజేయుచో ఆ బ్యాంకు మరునాటికే దివాలా తీయుట తప్పదు. కాబట్టి బ్యాంకులు ఎక్కువగా పరపతిని తయారుచేయవలసి వచ్చినప్పుడు నోట్లను

ముద్రించువా రా సంగతిని గమనించి, కావలసిన నోట్లను సప్లయి చేయవలసియుందురు. వారికి బ్యాంకులతో సంబంధ మున్ననేగాని అనగా వారికిగూడ బ్యాంకింగు వ్యాపార మున్ననేగాని ఆ సందర్భము లంతగా బోధపడవు. కావున కరెన్సీని ముద్రించువారుకూడ నొక బ్యాంకు సంస్థకు చెంది నవారగుచో వర్తక వ్యాపారములయొక్క వేగమును మాంద్యమును గమనించి తదనుకూలమైన కరెన్సీనోట్లను ప్రచార ములోనికి దెత్తురు. ప్రచారములోనికి తెచ్చుట యనగా పరపతిని తయారుచేయు బ్యాంకులవారికి అప్పు యిచ్చెదరు. వాని నాధారముగా గైకొని బ్యాంకులు పరపతిని వృద్ధిచే యును. బ్యాంకులు పరపతిని విరివిగా తయారుచేయునప్పుడు తగినన్ని కరెన్సీనోట్లు సప్లయి కాకున్నచో పరపతి విశేష ముగా లేకపోవుటచేత వర్తక వ్యాపారములు సాగవు. ధరలు మందగించును. ఋణగ్రస్తులకు భార మెక్కువ యగును. దేశము అల్లకల్లోలమగును.

అటులనే దేశమునకు విశేషముగా పరపతి అవసరము లేని సమయమున కరెన్సీ అధికారులు నోట్లను విశేషముగా ప్రచారములోనికి తెచ్చుచో ధరలు విశేషముగా పెరుగును. బీదసాదలకు మిక్కిలి కష్టములు సంభవించును. కూలి జన మునకు హాని కలుగును.

కాబట్టి బ్యాంకింగు వ్యవహారములను, దేశములోని వర్తక వ్యాపారములను తెలిసికొని బ్యాంకింగు పనిచేయునట్టి వ్యవస్థయే కరెన్సీ అధికారిగా నుండవలెనని పై సంగతులవల్ల ఋజువుచేయబడినది. మన దేశములో నిదివరకు జరుగుచున్న దుస్థితి యిదియే. కరెన్సీ అధికారము ప్రభుత్వమువారి చేతిలో నున్నది. బ్యాంకింగు వ్యవహారములు ఇంపీరియల్ బ్యాంకు మొదలైన బ్యాంకుల చేతిలో నున్నది. ఉభయుల అభిప్రాయములును ఏకీభవించినచో చిక్కులేదుగాని లేకున్న చాల చిక్కులు తటస్థించును.

పై జెప్పిన దానినిబట్టియే కరెన్సీ తగ్గించుట హెచ్చించుటలో ఎంత పరిమితివరకు జేయవలయునను విషయముకూడ బ్యాంకింగు వ్యవహారములో పూర్ణమైన అనుభవము కలవారికే తెలియునుగాని యితరులకు అంతగా తెలియజాలదు. కాన బ్యాంకింగు వ్యవస్థయే కరెన్సీ అధికారిగా నుండుట అవసరము.

ప్రతి దేశములోను బ్యాంకు లనేకములు గలవు. ఒక బ్యాంకునకు మరియొక బ్యాంకునకు గల సంబంధమును చక్కగా పాలించగల వ్యవస్థ యుండవలయును. ఒకచో రెండు బ్యాంకులుండి ఒక బ్యాంకు పరపతిని వృద్ధిజేయుచో

రెండవ బ్యాంకు పరపతిని యింకా వృద్ధిచేయుచున్న దను కొనుడు. రెంటికిని పోటీ తటస్థించును. ఆ పోటీలో ఏదో ఒక బ్యాంకు నశించును. ఆబ్యాంకులో కాతాగలవారందరికి దెబ్బతగులును. ఈరెండు బ్యాంకులమీద అధికారముచలా యించగల ఒకసంస్థయున్నచో వీనిలోనివిపోటీపడి నశించకుం డకాపాడును. ఇటులనే దేశములోగల బ్యాంకులన్నిటిసంబం ధమును పాలించగలవ్యవస్థ ఒకటివుండుట చాలయుపయోగక రము. ఒకబ్యాంకునందు జనులకు నమ్మకముకొంతతగ్గినచో ఆబ్యాంకునకుముప్పువాటిల్లును. సామాన్యముగా బ్యాంకులు చేయుపని యితరులవద్ద అప్పుతెచ్చుట లోకులకు అప్పులిచ్చుట గాన, ఆబ్యాంకునందు నమ్మకము తగ్గినచో బాకీదారులంద రు చుట్టుముట్టుదురు. వెంటనే బ్యాంకు అధఃపతితమగును. బాకీదారులు బ్యాంకును చుట్టుముట్టినప్పుడు, బ్యాంకువా రు బాకీదార్లకు కొందరికి వెంటవెంటనే డబ్బుసరిపెట్టుచో, తిరిగినమ్మకమేర్పడును. బ్యాంకు నిలువద్రొక్కుకొనగలదు. అట్టిస్థితిలోబ్యాంకునకు పరపతిగాని కరెన్సీనోట్లుగాని యి చ్చి సాహాయ్యముచేయగల పెద్దసంస్థ యుండవలయును. చిన్నసంస్థ యేదియు నిర్వహించజాలదు. ఈబ్యాంకునకు సా హాయ్యము చేయుటకువచ్చి అదికూడ దీనితోపాటు కూలి పోవును. నీటిలో మునిగిపోవుచున్నవానివద్దకు, వేరొక పురు షుడు సాహాయ్యమునకు వచ్చినచో వానితోకూడ వీడును

మరణించును. వేరొకడు పడవయందెక్కివచ్చినచో ఎటు లరక్షించగలడో, రిజర్వుబ్యాంకువంటి పెద్ద సంస్థఅండయై నిల చినచో ఆబ్యాంకు తెప్పిరిల్లగలదు.

ప్రభుత్వమువారిడబ్బును కాపాడుటకు ఏదైన సంస్థ యుండవలయును. ప్రభుత్వమువారికి పన్నులక్రింద వచ్చు ధనము అంతయు కొన్నిమాసములలో వచ్చును. వారు ఖర్చుపెట్టుట పండ్రెండుమాసములమీద జరుగును. వారి వద్దడబ్బులేనప్పుడు వారికిఅప్పిచ్చుటకు ఏదైన సంస్థయుండవల యును. వారిడబ్బు నిరర్థకముగా నున్నప్పుడు; దానిని సక్ర మమైన వ్యాపారములయందు వినియోగించినయెడల దేశ మునకు మేలుకలుగును. అట్టిపని చేయుటకుగూడ నొక పెద్ద సంస్థ యవసరము.

పెద్దపెద్ద రైళ్లు, ఆనకట్టలు మొదలైనవి కట్టవలసి వ చ్చినప్పుడు ప్రభుత్వమువారికి విశేషముగా ధనము కావ లయును. ఆధనమును ప్రభుత్వమువారు అప్పుతీసికొని వ త్తురు. సామాన్యముగా ప్రభుత్వములవారు, లోగడనే కొ న్ని ఋణముల చేసియుందురు. క్రొత్తఋణము వారికి కావ లసినయెడల, ఎక్కువవడ్డియిచ్చెదమనిచెప్పినచో, లోగడ నున్న గవర్నమెంటు పత్రములధరపడిపోవును. ఇదివరకు

నూటికి సాలుకు నాలుగురూపాయల వడ్డీమీద, ప్రభుత్వము వారు ఋణమును చేసిరనుకొందము. ఆఋణము ప్రామిశ్రీనోట్లరూపేణగాని పత్రములరూపేణగాని వుండును. ఆ పత్రములను చాలమంది కొందురు. వాటికి విలువయుండును. ఇతర ఆస్తులవలె నాపత్రములను కొనుటకు అమ్ముటకు వీలుగలదు. కొందరు డబ్బును వినియోగింపదలచి, ఆ పత్రములను కొనియుంచుకొందురు. అట్టిస్థితిలో నూటికి సాలునకు అయిదురూపాయలచొప్పున వడ్డీకి వేరొక ఋణమును ప్రభుత్వమువారు కోరుచో డబ్బునువినియోగించదలచినవారు, పూర్వపు పత్రములను, కొనుటకుబదులు, క్రొత్తపత్రములను కొందురు. పూర్వపు పత్రములను యెవ్వరుకొనకున్నచో, వానిధరపడిపోవును. ఇట్టివిషమస్థితులు విశేషముగా రాకుండుటకై యీఋణములను సాగించుటకు ఒక రిజర్వు బ్యాంకువంటిసంస్థ యవసరము. ఏలననగా వారు బ్యాంకింగు వ్యాపారము చేయుచూ దేశములోని ఆర్థికవిషయములను పూర్ణముగా గమనించి యుండుటచేత యేయేరీతినప్రకారము క్రొత్తఋణములను చేయుచో ప్రాతఋణములకు యిబ్బందియుండదో, ఆవిధముగా ఋణములను ప్రభుత్వమువారితరపున చేయగలిగియుందురు.

ప్రస్తుతకాలమున ఒక దేశమునకును మరియొక దేశ

మునకును విరివిగ వర్తకవ్యాపారములు సాగుచున్నవి. ఆ సందర్భములలో ఒకదేశము మరొకదేశమునకు బాకీపడు ట తటస్థించును. అట్లు బాకీపడుచో వారికిబంగారమిచ్చిన నేగాని వారుపుచ్చుకొనరు. లేక రెండుదేశములలో ప్రచారములోనున్న నాణెములుగాని కరెన్సీనోట్లుగాని ఒకటే అయినచో తద్వారా యివ్వవలసి యుండును. సామాన్యము గా బంగారములోనే యివ్వవలసివచ్చును. ప్రస్తుతకాలమున వ్యాపారములు కోట్లకుమిారి జరుగుచుండుటచేత వానికి చాలి నంతబంగారమున్ను దొరకుటకు కష్టముగానున్నది. అట్టి స్థితిలో ఆదేశములో ఒకపెద్దబ్యాంకున్నూ ఈదేశములో ఒక పెద్దబ్యాంకున్నూ యుండి వీరికివారికి కాతావున్నయెడల బం గారమునుపంపవలసిన అగత్యముండదు. ఈదేశమువారు ఆదేశమునకు బాకీపడుచో ఈదేశమువారికాతా ఆదేశము వారి బ్యాంకులో నుండునుగాన అందులో బాకీమొత్తము ఖర్చువ్రాయబడును. అటులనే ఆదేశమువారు యీదేశము వారికి బాకీపడినప్పుడుగూడ జరుగగలదు. బంగార మొక దేశములోనుంచి మరొకదేశమునకు తీసికొని పోవుటలో గల శ్రమయున్నూ ఖర్చున్నూ అందుచేనా దేశములో బంగారము యొక్క ధరలలో మార్పులున్నూ గలుగకుండుటకై పెద్దబ్యాం కులు ఉపయోగింపబడును.

ఇట్టి పెద్ద బ్యాంకులు ఒక దేశములో ఒకటియే యుండ వలయునా ఎక్కువగా నుండవలయునా యనువిషయమున ఒకటే యుండవలయుననుట నిర్వివాదము. ఆర్థికవ్యవహారములయందు ఆబ్యాంకునకు ప్రభుత్వమున్నదని చెప్పవచ్చును. ఒక దేశములో ప్రభువు ఒకడుండవలయునా లేక యిద్దరుండవలయునా యనుచో ఒకడే యుండవలయునుగాని యిద్దరుండవలయునని యెవ్వరైనను చెప్పసాహసింతురా? కాబట్టి పై విమర్శనము వలన దేశమునకు ఒక్కటే పెద్దబ్యాంకు ఉండవలయుననుట ముఖ్యమని తేలినది. దానికే సెంట్రల్ బ్యాంకు లేక రిజర్వు బ్యాంకు అని పేరు.

పై విచారణమువలన రిజర్వుబ్యాంకు అనునది యెందుకు కావలెనను విషయమున నిరూపింపబడిన హేతువులను క్లుప్తము గా యీక్రింద పొందుపరచెదను.

(1) దేశమునకు కరెన్సీనోట్లు అవసరముగాన వానిని ముద్రించు సంస్థ ఉండవలయును.

(2) పరపతిని దేశమునకు తయారుచేయు బ్యాంకులకు సమయానుకూలముగా సాహాయ్యముచేయుటకై కరెన్సీవ్యవహారము, బ్యాంకింగు అనుభవముగల వ్యవస్థయందే వుండవలయునుగాన,కరెన్సీయధికారము ఒక పెద్ద బ్యాంకువారికే ఉండవలయును.

(3) బ్యాంకులయొక్క పరస్పరసంబంధమును పాలించుటకు ఒక పెద్ద బ్యాంకు అవసరము.

(4) ఆపత్కాలమునందు; బ్యాంకులకు అప్పునొసగి సాహాయ్యముచేయగల పెద్ద బ్యాంకు ముఖ్యము.

(5) ప్రభుత్వమువారి ధనమును కాపాడుటకు పెద్ద బ్యాంకు అవసరము.

(6) ప్రభుత్వమువారి ఋణములను పరిపాలించుటకు పెద్ద బ్యాంకు కావలయును.

(7) విదేశమారకమునందు, అనగా, ఒకదేశము మరొకదేశమునకు సరిపెట్టవలసిన బాకీలవిషయమై ఒక పెద్ద బ్యాంకు అవసరము.

(8) చిన్న బ్యాంకులు తగినంత పరపతిని తయారుచేయలేనప్పుడు స్వయముగా పరపతిని తయారు చేయుటకు ఒక పెద్ద బ్యాంకు అవసరము.

ఈకారణములవలన, సెంట్రల్ బ్యాంకు రిజర్వుబ్యాంకు అనునది దేశమున చాలా అవసరమని తేలినది.



# మూడవ అధ్యాయము

మన దేశములో ప్రస్తుతమున కరెన్సీవిధానము నడుపుచున్నవారు ప్రభుత్వమువారు. అందులో ప్రత్యేకముగా యీ డిపార్టుమెంటునకు "కరెన్సీకంట్రోలరు" అను ఒక యధికారియుండును. ఆయుద్యోగిని నియమించుటలో సామాన్యముగా ప్రభుత్వము వారు, బ్యాంకింగు అనుభవములేని యే ఐ, సి. యస్, ఉద్యోగినో యేర్పాటుచేయుచున్నారు. సెంట్రల్ బ్యాంకు మన దేశమున యేర్పాటు చేసినచో ఆదుస్థితి తొలగగలదు. కాన పయి అధ్యాయమున చెప్పబడిన యెనిమిది కారణములుగాక, దీనిని తొమ్మిదవకారణముగా మన దేశమున మాత్రము అంగీకరింపవచ్చును. ఇట్టిరిజర్వుబ్యాంకు మన దేశమున స్థాపింపబడినచో, ఆర్థికముగా మన దేశమునకు కొంత మేలుకలుగగలదు. ఈ రిజర్వుబ్యాంకు జేయు పను లెవ్వియనగా:—

(1) కరెన్సీని అచ్చొత్తించి ప్రచారములోనికి తెచ్చుట

(2) విదేశమారకపు వ్యవహారములను చూచుట

(3) జాతీయ ఋణమును పరిపాలించుట

(4) దేశములోని వివిధరకములైన బ్యాంకులకు అవసరమైనప్పుడు సహాయముచేయుట.

(5) దేశమునకు వలయునంత కరెన్సీనిగాని పరపతినిగాని నిర్మించుట

(6) వస్తువుల ధరలలో విశేషముగా మార్పులు రాకుం డునట్లు కాపాడుట

(7) బాకీలను సర్దు బాటు చేయుట

(1) కరెన్సీని ప్రచారములోనికి తెచ్చుట యనగా కావలసినవారికి అప్పుయిచ్చుట; సాధారణముగా యితర బ్యాంకులకు రిజర్వుబ్యాంకు అప్పుయిచ్చును;వారు తిరిగి అనో ట్లనుగాని వారి పరపతినిగాని లోకులకు అప్పుయిత్తురు. కాబట్టి ధనము విశేషముగా ప్రచారములోనుండి వ్యవహార ములు బాగుగాసాగును.

(2) విదేశమారకములనగా ఒకదేశమునకున్న మరి యొకదేశమునకున్న వర్తక వ్యాపారములవిషయమై సంబం ధము కలదు. ఆసంబంధమున ఒకరొకరికి యిచ్చిపుచ్చుకో నుట తటస్థించును. ఒకదేశములో గలనాణెములుగాని కరెన్సీ నోట్లుగాని మరొకదేశమున నుండవు.ఉదాహరణము:—మనదే శములో రూపాయలును రూపాయనోట్లునూ గలవు. ఇంగ్లండుదేశములో పౌండు నోట్లు మాత్రమేగలవు. మనము యింగ్లండువారికి బాకీపడినచో వారిపౌండునోటులలో యివ్వ వలయును. వారుమనకు బాకీపడినచో మనకు వారు రూపా యలలోగాని రూపాయనోట్లలోగాని యివ్వవలసియుందురు. రూపాయలను పౌండులలోనికి యేరేటు ప్రకారము యివ్వవ

లయును, పౌండులను రూపాయలలోనికి యే రేటు ప్రకారము యివ్వవలయునను ప్రశ్న రాకమానదు. ఆ రేటు యే ప్రకారముగా నుండినచో దేశమునకు లాభకరమో ఆలోచించి ఆ రేటును అవసరమగుచో నిర్ణయించుభారము రిజర్వు బ్యాంకునకు గలదు. ఈ రేటువలన దేశమునకు లాభముగాని నష్టముగాని విశేషముగా వాటిల్లును. ప్రస్తుతము, మన దేశమున పదునెనిమిది పెన్నీల రేటు వున్నది. అనగా ఒకరూపాయ నూర్చిన యెడల పదునెనిమిది పెన్నీలు వచ్చును. ఇంగ్లీషువారికి పౌండులు, షిల్లింగులు, పెన్నీలు అను నాణెములు గలవు. పండ్రెండు పెన్నీలొక షిల్లింగునకు సమానము. యిరువది షిల్లింగు లొక పౌండునకు సమానము. ఈ రేటు ప్రకారమొక పౌండు షుమారు పదమూడు రూపాయల అయిదు అణాల డబ్బుకు సమానమగును. ఈ మారకపు రేటు వలన మన దేశమునకుగూడ రాని నష్టము వచ్చినదని మనవారందరును యేకగ్రీవముగ చెప్పుచున్నారు. ఈ మారకపు రేటును దేశమునకు అనుకూలమగు రీతిని సమర్థించుట రిజర్వు బ్యాంకు యొక్క విధియై యున్నది. అయితే ప్రస్తుతము మనకు తయారగుచున్న రిజర్వు బ్యాంకు బిల్లు సందర్భములో యీ పదునెనిమిది పెన్నీల రేటును మార్చుటకు రాబోవు రిజర్వు బ్యాంకునకు పూర్ణాధికారము లేదని యును గవర్నరు జనరలుగారు ముందుగా వప్పుకొన్ననేగాని

మారకపు రేటును మార్చుటకు తగిన యధికారము రిజర్వు బ్యాంకు వారికిగాని యిండియా ప్రభుత్వమువారికిగాని లేద నియు శ్వేతపత్రమున యేర్పాటు చేయబడినది. ఇది మన దేశమునకు చాల నష్టదాయకము. మారకపు రేటును మార్చుటకు అధికారము, రిజర్వు బ్యాంకువారి సలహామీద మనశాసన సభవారికుండవలయును. లేకున్న చాలా ముప్పు వాటిల్ల గలదు.

(3) మన దేశమునకు ప్రస్తుతము 1212 కోట్ల రూపాయలకుపైగా జాతీయ ఋణము కలదు. అనగా మనతరపున మన గవర్నమెంటువారిచే చేయబడిన ఋణమని యర్థము. ఎప్పుడెప్పుడు క్రొత్త ఋణములు కావలసినదియు నేయే రేట్ల ప్రకారము కావలసినదియు ఏ దేశములలో తీసి కొనవలసినదియు, ప్రాత ఋణములను ఏ విధముగా తీర్చవలసినదియు అను బాధ్యత రిజర్వు బ్యాంకువారి యందే వుండలయును. ఈ ఋణమును చేయుటలో నష్టము ఏ విధముగా వచ్చునో కొంచెముగా పయిన సూచించియున్నాను.

(4) దేశములో చిన్న బ్యాంకులు తమ డబ్బులో కొంత భాగమును రిజర్వు బ్యాంకునందు దాచుకొనును. అవసరమైనప్పుడు ఆ డబ్బున్న అంతకు పైగా యింకా అప్పున్న

చిన్న బ్యాంకులను రిజర్వు బ్యాంకు వారిత్తురు. ఒక వెయ్యి రూపాయలు రిజర్వు బ్యాంకులో వారు దాచుకొన్న యెడల షుమారు మూడువేలరూపాయల వరకు రిజర్వు బ్యాంకువారు కష్టసమయములయందు వారికి అప్పు యిచ్చెదరు. బిల్లులన్న యేమో, పైన వివరించి యుంటిని. ఆ బిల్లులు ఒకరి వద్ద నుంచి మరియొకరివద్దకు ట్రాన్స్ఫరు అగుచుండును. ఆ బిల్లు ఒక బ్యాంకువద్దకు వచ్చినయెడల, ఆ బిల్లును రిజర్వు బ్యాంకు నకు అమ్మినచో వారికి రిజర్వు బ్యాంకువారు రొఖమును యిత్తురు. దీనినే రీడిస్కౌంటింగు (Re-discounting) అందురు. దీనివలన చిన్న బ్యాంకులవారు తమకు అవసర మువచ్చినప్పుడు అప్పు తెచ్చుకొనుటయేగాక, యీరీడిస్కౌం టింగు తిరిగి అమ్ముటవలన రొఖ్ఖమునుగూడ సంపాదించగలు గుటకు రిజర్వు బ్యాంకు ఆధారమగును.

(5) మనకరెన్సీ రెండు విధములుగానున్నది. వెండి రూపాయలు రూపాయనోట్లునూ్ను మనకు గలవు. రూపా యనోట్లను వెండిరూపాయలలోనికి మార్చుకొనవచ్చును. నోట్లకు వెండిరూపాయలను యివ్వవలసిన బాధ్యత కరెన్సీయ ధికారులకు గలదు. ఈ కరెన్సీనోట్లను ఒక్కుమ్మడిగా అం దరును రూపాయలలోనికి ఒక్కసారి మార్చుట తటస్థించదు. అందువలన యెన్ని నోట్లు ప్రచారములో నున్నవో అన్ని రూపాయలు కరెన్సీ అధికారుల పెట్టెలో వుండనవసరము లేదు.

పేపరు కరెన్సీకి ఆధారముగ కరెన్సీ అధికారులవద్ద రెండు విధములైన రిజర్వులు గలవు. ఒకటి లోహ సంబంధమైన రిజర్వు. రెండు శెక్యూరిటీ రిజర్వు. లోహ సంబంధమైన రిజర్వు అనగా వెండి, బంగారములుగాని వానితో చేయబడిన నాణెములుగాని యని యర్థము. శెక్యూరిటీ రిజర్వు అనగా కరెన్సీ యధికారులకు యితరులవల్ల రావలశిన బాకీలని యర్థము. యీ రెండు విధములైన రిజర్వులను మొత్తముచేసినచో ప్రచారములోనున్న పేపరు కరెన్సీ మొత్తమునకు సరిపోవును. ప్రస్తుతమున్న కరెన్సీ రిజర్వులయొక్క పట్టికను యిందు పొందుపరచెదను. ది 31-10-33 తారీఖున ప్రచురింపబడిన కరెన్సీ లెక్కలు యీ పట్టికలో నున్నవి.

| | | |
|---|---|---|
| కరెన్సీ రిజర్వు. | | ప్రచారములో నున్ననోట్లు. రు 180,04,35,401 |
| వెండిరూపాయలు | (ఇండియాలో) | 94,32,86,832 |
| బంగారము. | | 29,69,79,991 |
| వెండి. | | 9,90,85,187 |
| శెక్యూరిటీ రిజర్వు (కొనబడినది యిండియాలో నున్నది) | | 46,10,83,391 |
| | | 180,04,35,401 |

ఇంగ్లాండులో ప్రస్తుతము వెండి బంగారములులేవు.

శెక్యూరిటీరిజర్వు అనుదానిలో ప్రస్తుతము గవర్నమెంటు పత్రములున్నవి. ప్రస్తుతము కరెన్సీయధికారులు, ఎక్కువ కరెన్సీని ప్రచారములోనికి తీసికొనిరావలెనన్న నీ శెక్యూరిటీలనుగాని లేక వెండి బంగారములనుగాని కొని అందుకైన నోట్లు ముద్రించి యిచ్చుచో కరెన్సీ వృద్ధియగును. కరెన్సీ తగ్గించ వలసియున్నచో, వెండి బంగారములనుగాని శెక్యూరిటీలనుగాని అమ్మెదరు. వాని కొనుఖరీదు కరెన్సీ యధికారులకు వచ్చునుగాన ఎంత మొత్తమునకు వానిని అమ్మెదరో అంత మొత్తము కరెన్సీ ప్రచారములోనుంచి తగ్గిపోవును. వీరి కరెన్సీ శెక్యూరిటీ రిజర్వునందు, బిల్లులు హుండీలు మొదలైనవి ప్రస్తుతమునలేవు. ఇవి యున్న యెడల చాలా మేలుకలుగును. పేపరుకరెన్సీ యనునది అవసరమైనప్పుడు హెచ్చించుటకున్నూ లేక తగ్గించుటకును వీలుగానుండవలెను. దీనినే పాశ్చాత్యులు Automatic కరెన్సీయందురు. కేవలము గవర్నమెంటు పత్రములే శెక్యూరిటీగాయున్నచో అట్టిస్థిరానేరదు. ఒకకాలమున గవర్నమెంటు పత్రముల ధరలు తక్కువగా నున్నదనుకొనుడు. అప్పు కరెన్సీని తగ్గించుటకై కరెన్సీవారు కూడా తమ శెక్యూరిటీలను అమ్మిన యెడల యాపత్రముల ధరలు మరింత పడిపోయి, ఆపత్రములు కొన్నవారికి, కూడరాని నష్టము వచ్చును. అటులనే ఆపత్రముల ధరలు హెచ్చుగా నున్నప్పుడు కరెన్సీ

ఎక్కువచేయవలెనని కరెన్సీ యధికారములు, ఆపత్రిములను కొనుచో వాటిధర మరింతలేచును. ఇట్టి చిక్కులు రాకుండుటకై, బిల్లులు, హుండీలను గూడ, రిజర్వుగా నంగీకరించునెడల, కరెన్సీ చాలా బాగుగా నుండునని శాస్త్రజ్ఞుల యభిప్రాయము. అనుభవమువలనగూడ నది సిద్ధమగుచున్నది. ఇదియెట్లు తేటపడ్డించునో విపులముగా వ్రాసినగాని బోధపడదు. గ్రంథవిస్తర భీతిచే దాని నిట వ్రాయదలచుకొనలేదు. బిల్లులు హుండీలు కూడ, శెక్యూరిటీరిజర్వునందు విరివిగానుండుట కరెన్సీ పాలనమునకు, ముఖ్యముగా దేశమునకు నష్టము కలుగనిరీతిగా, కరెన్సీనోట్లను, అవసరము వెంట తగ్గించుటకు హెచ్చించుటకు చాలవీలుగానుండును. అట్టి పని రిజర్వు బ్యాంకువారు తప్ప, యితరులుచేయలేరు. ఏలననగా, రిజర్వునందున్న బిల్లులు, సకాలమునకు డబ్బు వసూలు కాతగినట్టులుండవలెను. ఏ బిల్లులు మంచివో, ఏవి మంచివికావో బ్యాంకింగు అనుభవము పూర్తిగానున్నవారికిగాక, యితరులకు బోధపడదు. అందువలన కరెన్సీ పాలనము రిజర్వు బ్యాంకువారు చేయవలెను. తనతో సంబంధముగల చిన్న బ్యాంకులకు, అవసరమైనప్పుడు పరపతి నొసగుగాన, రిజర్వు బ్యాంకు పరపతిని తయారుజేసి, తద్వారా దేశమునకు కావలసిన పరపతిని తయారు చేయును.

(6) వ్యాపారము మందముగానున్నప్పుడు, కరెన్సీ తక్కువగానుండుట, చురుకుగానున్నప్పుడు కరెన్సీ విరివిగానుండుట తటస్థించిన యెడల వస్తువుల ధరలలో విశేషముగా వ్యత్యాసము తటస్థింపదు. వస్తువులయొక్క గిరాకి, సప్లయిలు ఒకే మోస్తరుగానుండి, కరెన్సీ ఎక్కువగా యగుచో ధరలు లేచును. తక్కువయగుచో ధరలు పడిపోవును. వ్యాపారముల చురుకు మందములను గమనించి కరెన్సీప్రచారమును సాగించుచో ధరలలో మార్పులు అంతగా జరుగవు. అట్లు చేయుటకు పూర్తిగా బ్యాంకింగు అనుభవముండి వ్యాపారముల చురుకు మాంద్యముల గమనించి 'Money-market' డబ్బు బజారు యొక్క స్థితిగతులను పూర్తిగా అవగాహనము చేసికొనగల రిజర్వు బ్యాంకువంటి సంస్థ యున్ననేగాని వీలుగాదు. ఎక్కడ డబ్బు వడ్డీకి యివ్వబడునో, ఎక్కడ డబ్బుగలవారు తమ డబ్బును వడ్డీకియిచ్చుటకు వసతులుగలవో దానికి డబ్బుబజారు అని పేరు.

(7) పరపతి యనునది బాకీలయొక్క అవాప్తిమీద ఆధారపడియున్నదని పైన వ్రాసియుంటిని. బ్యాంకులు విశేషముగా నెలకొల్పిన యెడల యీ బ్యాంకు చెక్కులు ఆ బ్యాంకుమీదను, ఆ బ్యాంకు చెక్కులు యీ బ్యాంకు మీదను ఉండుట తటస్థించును. ఆంధ్ర బ్యాంకుమీదనున్న

చెక్కులు వెయ్యి రూపాయలని హిందూస్థానీ బ్యాంకులో నున్నవనుకొనుడు. హిందూస్థానీ బ్యాంకుమీద చెక్కులు రెండువేల రూపాయలవరకు ఆంధ్రబ్యాంకు వద్దనున్నవనుకొనుడు. వారిరువురిమధ్య ఈ విధముగా జరుగవచ్చును. హిందూస్థానీ బ్యాంకువారు, వెయ్యిరూపాయలను, ఆంధ్ర బ్యాంకువారివద్ద వసూలుచేయుట, తిరిగి అంధ్రబ్యాంకువారు హిందూస్థానీ బ్యాంకువారివద్ద రెండువేలు వసూలుచేయుట. అటులగుచో రెండువేల రూపాయలకు పనితగులును లేక తమకు కావలసిన్ని రెండు వేలలో తమరివ్వవలశిన వెయ్యి రూపాయలు మినహాయించుకుని మిగతా వెయ్యి రూపాయలనే ఆంధ్ర బ్యాంకువారు తీసుకొన్నచో అప్పుడు వెయ్యి రూపాయలకు పని తగులును. అట్లుగాక యీ రెండు బ్యాంకులకు రిజర్వు బ్యాంకుతో కాతా యున్నచో, ఎవరును ఎవరికి డబ్బు యివ్వనక్కరలేదు. హిందూస్థానీ బ్యాంకువారు, తమకు రావలసిన్ని చెక్కులను రిజర్వు బ్యాంకునకు యిచ్చుచో ఆంధ్రబ్యాంకు కాతాలో వెయ్యిరూపాయలు ఖర్చువ్రాసి హిందూస్థానీ బ్యాంకు కాతాకు జమకట్టుదురు. అటులనే హిందూస్థానీ బ్యాంకుమీద చెక్కులను ఆంధ్రబ్యాంకువారు రిజర్వు బ్యాంకులో యిచ్చుచో రెండువేల రూపాయలను హిందూస్థాని బ్యాంకు కాతాకు ఖర్చువ్రాసి ఆంధ్రబ్యాంకు కాతాలో జమ కట్టుదురు. అందువలన యెవరును రెండవ

వారికి డబ్బు నివ్వ నక్కరలేకపోవును. దీనిని బాకీలు సర్దుబాటుచేయుట యనగా, ఇంగ్లీషులో దీనిని (clearing function) అందురు.

పై జెప్పిన యేడు విధములుగా రిజర్వుబ్యాంకు దేశమునకు సహాయము చేయును.

---

# నాల్గవ అధ్యాయము

కడచిన అధ్యాయములందు డబ్బు యన నెట్టిదో దాని యుపయోగము లెట్టివో, కరెన్సీయన నెట్టిదో, దాని, యుపయోగము లెవ్వియో, పరపతి యన నెట్టిదో, దాని యుపయోగము లెవ్వియో, పరపతిని యెవరు నిర్మాణము చేయుదురో, అట్టి బ్యాంకులవలన ఉపయోగము లెవ్వియో రిజర్వుబ్యాంకు యెందు కవసరమో, దానివలన ప్రయోజనము లెట్టివో విమర్శించి యుంటిని. ఆ రిజర్వు బ్యాంకు నిర్మాణ మెట్లు లుండవలయునో యీ యధ్యాయమున కొంత; తెల్పెదను.

మన దేశమున కొలది మాసములలోనే రిజర్వుబ్యాంకు స్థాపంపబడనున్నది. అదివాటాదారుల బ్యాంకుగానుండవలయు నని మనప్రభుత్వమువారు తీర్మానించియున్నారు. వాటాదారుల బ్యాంకు మంచిదా, ప్రభుత్వపుబ్యాంకు మంచిదా యని చర్చ మనదేశమున చాలకాలమునుంచి గలదు. బ్యాంకు వ్యవహారమును సాగించుటకు కొంతపెట్టుబడి కావలయును. ఆ పెట్టుబడిని వాటాలప్రకారము భాగించి వాటాయొక్క కిమ్మతు, ఏ నూరురూపాయలో, ఏ అయిదువందల రూపాయలో యేర్పరచి ఆ వాటాలను, ప్రజలు కొనుటకు వీలున్నచో అది వాటాదారుల బ్యాంకుఅనబడును. దాని మేనేజమెంటు అంతయు వాటాదారులచే ఎన్నుకొన బడినట్టి పరిపాలకుల చేతిలో నుండును. వారినే డైరెక్టర్లనియు; గవర్నరనియు; సాధారణముగా అందురు. ప్రభుత్వపు బ్యాంకునకు కావలసిన్ని పెట్టు బడి మొత్తము ను ప్రభుత్వవారే సప్లయి చేయుదురు. పరిపాలన మంతయు ప్రభుత్వమువారి చేతులయందే యుండును. అట్టి బ్యాంకునకే ప్రభుత్వపు బ్యాంకు అని పేరు. కేవలము వాటాదారుల బ్యాంకు అయినను ప్రభుత్వమువారితో కొంత సంబంధమును కలిగియేయుండును. బ్యాంకుయొక్క లెక్కలను ప్రభుత్వమువారికి చూపించుచుండవలయును. సరిగా చట్టముల ప్రకారము, పని సాగింపకున్నయెడల ఆ రిజర్వు బ్యాంకును రద్దుపరచి తమస్వాధీన

ములోనికి ప్రభుత్వమువారు తీసికొందురు. ఈ విధముగా కొంత ప్రభుత్వముతో సంబంధము వాటాదారుల బ్యాంకున కైనను తప్పదు. రిజర్వు బ్యాంకు అనగా దేశమునకు క్షేమమును గూర్చు సంస్థగాన కేవలము స్వార్థపరులైన వాటాదారుల స్వాధీనములో నుండుటవలన దేశమునకు కొంత నష్టము రావచ్చునుగాని, అట్టి నష్టము రాకుండుటకై కొన్ని ఉపాయములు కల్పింపబడినవి. రిజర్వు బ్యాంకునకు యెంత లాభము వచ్చినను నూటికి యింతకంటె యెక్కువ లాభమును వాటాదారులకు యివ్వకూడదను నిబంధనములు వాటాదారుల బ్యాంకు లున్నచోటుల గలవు. రిజర్వు బ్యాంకుమీద లాభములు విదేశీయులు అనుభవించకుండునట్లున్నూ, తమ దేశమువారికి లాభము కలుగురీతిని విదేశీయులు ప్రవర్తింపకుండునట్లున్నూ, విదేశీయులు వాటాలను కొనకుండునట్లున్నూ నిబంధనలుకూడ యవసరము. వాటాదారులలో అందరు గాని లేక చాలాభాగమువరకుగాని స్వదేశీయు లుండుట దేశమునకు శ్రేయోదాయకము. వాటాలు విదేశీయుల గతమగుచో దేశమునకు ముప్పు వాటిల్లుట సిద్ధము. మన దేశములో స్థాపింపబడనున్న రిజర్వు బ్యాంకునందు విదేశీయులు వాటాలు కొనకుండునట్లు జేయు నిబంధనమునకు ప్రభుత్వమువారు సమ్మతింపలేదు. పోనీ, నూటికి యే 75 మంది యైనను స్వదేశీయులు ఉండవలయునను సవరణనుగూడ

ప్రభుత్వమువారు అంగీకరింపలేదు. అన్యదేశీయులు వాటాల నన్నింటిని కొని మన దేశమునకు అపకారము చేయుదురను భయము లేకున్నచో వాటాదారుల బ్యాంకునకైనను అభ్యంతరముండ నవసరములేదు. పై నిబంధన యున్నచో మన దేశ ప్రస్తుత పరిస్థితులనుబట్టి ప్రభుత్వపు బ్యాంకునకంటె వాటాదారుల బ్యాంకువలననే తక్కువ నష్ట మున్నదని చెప్పవచ్చును. వాటాదారుల బ్యాంకునందు వాటాదారులచేత యెన్నుకొనబడినవారు కొందరు పరిపాలకులుగా నుందురు. వారినే డైరక్టర్లందురు. ప్రభుత్వపు బ్యాంకునందు ప్రభుత్వమువారిచే నియమింపబడిన డైరక్టర్లు ఉందురు. ఈ డైరక్టర్ల సలహామీద ప్రతిరోజు జరుగు వ్యవహారములను పాలించుటకు ఒక గవర్నరు ఉండును. అతనికి సహాయులుగా డిప్యూటీ గవర్నరులుకూడ కొన్నిచోట్ల యుందురు. రిజర్వు బ్యాంకు ప్రయోజనము ఎక్కువగా గవర్నరులబట్టి యుండును. అతడు సమర్థుడై యుండవలెను. దేశ క్షేమమును ఆలోచించువాడుగా నుండవలెను. వాటాదారుల బ్యాంకునందుగల డైరక్టర్లు స్వదేశీయులై యుండవలయును. లేకున్న వారిలో చాలామంది యైనను స్వదేశీయులై యుండవలయును. విదేశీయులగుచో వారి దేశముయొక్క మేలునే వారాలోచింతురు. గవర్నరుకూడా స్వదేశీయుడై యుండుట మేలు. ప్రతిరోజు జరుగు వ్యవహారములు అతని

హస్తములం దుండునుగాన స్వదేశమునకు మేలుజేయు సద్దేశముగలవాడేగవర్నరుగానుండవలయును. ప్రస్తుతముప్రపంచములోదాదాపుగాఅన్ని పెద్ద దేశములలోను రిజర్వు బ్యాంకులు గలవు. ఒక్క కెనడా దేశములో మాత్రము అట్టి పెద్ద బ్యాంకు లేదు. కాని యీ మధ్యవచ్చిన వార్తలనుబట్టి అక్కడగూడ ఒక సెంట్రల్ బ్యాంకును ఏర్పాటు చేయవల యునని అనుకొనుచున్నట్లు తెలియవచ్చినది. ప్రస్తుతమున ప్రపంచములో సెంట్రల్ బ్యాంకులు 32 గలవు. అందులో 17 వాటాదారుల బ్యాంకులు. 8 ప్రభుత్వపు బ్యాంకులు. 7 కలగలుపు బ్యాంకులు. కలగలుపు బ్యాంకులు అనగా కొంతవరకు వాటాదారులకున్నూ కొంతవరకు ప్రభుత్వమున కున్నూ అధికార ముండును. అనగా వాటాలలో కొన్ని వాటాలు ప్రభుత్వమువారున్నూ, కొన్ని వాటాలు ప్రజలున్నూ కొందురు. ఇంగ్లాండు, జర్మనీ, ఆస్ట్రేలియా మొదలైన దేశములలోని బ్యాంకులను వాటాదారుల బ్యాంకులుగా గ్రహించవచ్చును. రష్యా, ఫిన్‌లెండు, లాట్వియా మొదలైన దేశములలోని బ్యాంకులు కేవలము ప్రభుత్వపు బ్యాంకులు. కొలంబియా, జెకోస్లోవాకియా మొదలైన దేశములలోని బ్యాంకులు, కలగలుపు బ్యాంకులు. వీనిలో పెట్టుబడి ధనము కొంత వాటాదారులదిగాను కొంత ప్రభుత్వమువారిదిగాను ఉండును.

వాటాదారులచే నిర్మింపబడెడు రిజర్వు బ్యాంకు మన దేశమున స్థాపించవలయుననియు, ఫెడరేషన్ లేక రాష్ట్రసమవాయమునకు ముందుగా దానిని స్థాపించుట అవసర మనియు

కాంగ్రెసు టేబిలు సభవారియొక్కయు, శ్వేత పత్రిమున ప్రచు రించిన ఆంగ్ల ప్రభుత్వమువారియొక్కయు అభిప్రాయమై యున్నది. ఇండియాలో నున్న లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యుల వలననే రిజర్వు బ్యాంకు శాసనము తయారు అగుచున్నది. రిజర్వు బ్యాంకును యెటుల స్థాపింపవలయును అను విషయ మునుగూర్చి యీమధ్య లండనులో ఒక కమిటీవారు విచా రించి కొన్ని తీర్మానములు చేసియున్నారు. ఆ తీర్మాన ములు పత్రికలలో ప్రచురింపబడి యున్నవి. ఆ తీర్మాన ములను విచారించుటకు సెలెక్టు కమిటీవారు యేర్పడిరి. వారి తీర్మానములుకూడ ప్రచురింపబడియున్నవి. ఇట్టి స్థితిలో రిజర్వు బ్యాంకుయొక్క పూర్వ చరిత్ర తెలిసికొనుట కొంచెము ముఖ్యముగాన దానినిగూర్చి యించుక వ్రాసెదను.

1913–1914 సంవత్సరమున యేర్పాటు కాబడిన చేంబర్లేను కరెన్సీ కమిషనువారు ఆర్థిక శాస్త్రజ్ఞులయొక్క కమిటీ నొకదానిని యేర్పరచి, రిజర్వు బ్యాంకు స్థాపనను గూర్చి విచారణ సలుపవలసిన అవసర మున్నదని సూచించి యున్నారు. తరువాత 1926 సంవత్సరమున యేతెంచిన హిల్టనుయంగు కరెన్సీ కమిషనువారు రిజర్వు బ్యాంకు నేర్పా టుచేయుట చాల అవసరమని వ్రాసి యున్నారు. అందులో నొక సభ్యుడగు పురుషోత్తమదాస్ ఠాకూర్ దాసుగారు ప్రస్తు తమున్న యింపీరియల్ బ్యాంకునే రిజర్వు బ్యాంకుగా మార్చ వలయునని సూచించియున్నారు. 1927 సంవత్సరమున అప్పటి ఆర్థికమంత్రియగు బేసిల్ బ్లాకెట్టుగారు ఒకరిజర్వు బ్యాంకుబిల్లును తయారుజేసిరి. ఆబిల్లులో వాటాదారులబ్యాం

కునే స్థిరపరచినారు. ఆసమయమున మోతీలాల్ నెహ్రూ, మాలవ్యావంటి దేశప్రముఖులు శాసనసభయందుండి, వాటాదారుల బ్యాంకు పనికిరాదనియు, దానినే యేర్పాటుచేయునెడల భారతీయులకే ఎక్కువవాటాలుండవలయుననియు డైరెక్టర్లలో ఎక్కువ మంది భారతీయులే యుండవలయుననియు తీవ్రముగా వాదించుటచేత బ్లాకెట్టుగారుకూడ, తనయభిప్రాయమును మార్చుకొనవలసివచ్చెను. అట్టిసమయమున శ్రీనివాస అయ్యంగారు కొన్ని మార్పులను సూచించి యున్నారు. ఆసూచనల నంగీకరించి బ్లాకెట్టుగారు శాసనమునువపాదింపదలచిరిగాని, యిండియా మంత్రిఅందుకు సమ్మతింపలేదు. తిరిగి వాటాదారుల బ్యాంకునే తనయిచ్ఛవచ్చిన రీతిని యేర్పాటు చేయవలెనని యిండియామంత్రి సంకల్పించి తదనుకూలమైన బిల్లును ప్రవేశపెట్ట యత్నించెను. కానిఅప్పటికి అధ్యక్షతవహించి స్వపక్ష పరపక్ష నిర్ధూమధాముడని పేరందిన విఠల్ బాయిపటేలుగారు, బిల్లుసరియైనదికాదని త్రోసివేసిరి. ఆకారణమున నాశాసన ముపసంహరించుకొన బడెను.

తరువాత 1930 సంవత్సరమున ప్రభుత్వమువారు బ్యాంకింగు ఎన్‌క్వయిరీకమిటీనిస్థాపించిరి. దానికి భూపేంద్రనాథమిత్రిగారు అధ్యక్షతవహించిరి. ఆకమిటీలో అన్నివిధములైన బ్యాంకులవారికి ప్రాతినిధ్య మియ్యబడెను. వారందరును యేకగ్రీవముగాప్రభుత్వముబ్యాంకు కావలయునని సూచించిరి. ఆకమిటీమెదుట సాక్ష్యమిచ్చినట్టియు సెంట్రల్‌బ్యాంకులు అనుగ్రంథమునకు కర్తయైనట్టియు కిష్‌గారు ఇండియాకు ప్రభుత్వపు బ్యాంకు ఎక్కువమంచిదని వ్రాసియున్నారు.

ఈమధ్య లండనులో సమావేశమైన రిజర్వుబ్యాంకు కమటీవారుగాని, మనఆర్థికమంత్రిగారుగాని ప్రభుత్వపు బ్యాంకువిషయమై బ్యాంకింగు ఎన్క్వయిరీ కమిటీవారుచేసిన సూచనను యెందుకు నిరాకరించ వలసివచ్చినదో కారణము చెప్పలేదు. అయినను వాటాదారుల బ్యాంకునే నెలకొల్ప యత్నించుచున్నారు. శాసనసభలో ఆర్థిక మంత్రిగారు ప్రసంగించుచు వాటాదారులుగాని డైరక్టరులుగాని, భారతీయులే విశేషముగా నుండుట న్యాయ్యమేగాని అది శాసనరూపమున నుండుట భావ్యముగాదనియు, అనుభవములో తప్పక భారతీయులకే ప్రాధాన్యమువచ్చుననియు నుడివియున్నారు. అదియెంతవరకు జరుగునో భావికాలము నిర్ణయింపవలసియున్నది.

ఈరిజర్వుబ్యాంకునుగూర్చిన లండనుకమిటీ తీర్మానములున్నూ ఆర్థికమంత్రిగారు ప్రవేశపెట్టిన బిల్లున్నూ, సెలెక్టుకమిటీవారి తీర్మానములున్నూ యీమధ్యజరిగిన శాసనసభలోని తీర్మానములున్నూ వార్తాపత్రికలలో ప్రచురింపబడియున్నవి. వానినిగూర్చి గ్రంథవిస్తరభీతిచే నిందు వ్రాయదలచుకొనలేదు. ఆర్థికమంత్రిగారి బిల్లులోని అంశములగూర్చి 26-8-33సం॥ తేదీనుండి వరుసగా ఆరువారములలో వెలువడిన కృష్ణాపత్రికలలో విమర్శనము చేసియున్నాను. దానిని పాఠకులు పఠింతురుగాక.

సమాప్తము.

—o—

BC

వలయువారు :—

కాశీనాథుని పూర్ణ మల్లిఖార్జునుడు,

ఎం. ఎ., బి. ఎల్. అడ్వకేటు,

బుట్టయ్యపేట, బందరు.

—: తప్పొప్పుల పట్టిక :—

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 35 | 11 | యురువది | యిరువది |
| 36 | 8 | 12 కోట్ల | 1212 కోట్ల |



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B135 |
| పుస్తకం పేరు | రిజర్వుబ్యాంకు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | ci, Bci |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |